# రమాధవా!

మరుపులొలికెడుముద్దుమోమునకురులుమూగిచలింపగా
మెరుగుబంగరు మేనికాంతులు మీరి దిక్కులనిండగా
సరసవందిజనంబు పొగడగ: గరుడవాహనమందునా,
పురముతిరిగితె? దివ్యవైభవపూడివాడరమాధవా !

చెలినిచూడవు పల్కరింపవు చేరదీయవిదేలరా?
కలికి నీకై మరులుగొన్నది, కడు వడంకెడుబేలరా !
చలముమానర! కరుణబూనర! చంచలాక్షిని ఏలరా !
పొలతిగోలర! దివ్య వైభవపూడివాడరమాధవా!

నిన్నరాతిరి నీవు వే క నెలతయింటికిపోవగా,
కన్నులారగకాంచివేదన మిన్నకుండితినేకదా!
ఎన్నిగుండెలతోడవచ్చితి విచ్చటకు నన్నంటకూ,
పున్నెముండును, దివ్యవైభవపూడివాడరమాధవా !

ఏలయిచ్చట? నీదుప్రియసఖి ఎదురుచూచుచునుండుసూ,
తాళజాలదు నీవు నాకడ తడసినను వినిమండుసూ,
చాలుచాలురనీదు మోసముస్పష్టముగ కన్పించెనూ
ఖోలునాయిది, దివ్యవైభవపూడివాడరమాధవా।

తెల్లవారులు నిద్రలేదనితెల్లముగ గురుతించితీ,
పల్లవాధరి నుదుటికుంకుమ ఫాలమున గమనించితీ,
గల్లములకొనగోటి గాటులగాయములు గణుతించితీ,
బొల్లులేటికి? దివ్యవైభవపూడివాడరమాధవా।

రాముడొక్కడె ఏకపత్నీవ్రతుడితుండనచెల్లునూ,
స్వామి! నీకోవేలకొలదిగభార్యలేకావలసెనూ;
ఏమి యిందలు జాలినొందగ ఏమియెఱుగనియట్టులూ
మోముజూపవు, దివ్యవైభవపూడివాడరమాధవా!

బాలరా! గుణజాలరా! మురిపాల వెన్నెలజాలురా!
గోలరా! విరిమాలరా! మరుకోలరా! మృదుశీలరా!
బేలరా! రసలోలరా! నినువేడుకొన్నది యేలరా!
మ్రోలనున్నది దివ్యవైభవపూడివాడరమాధవా:

రవ్వసేయక లోకమాతగు రాజ్యలక్ష్మిని కూడరా।
అవ్వ యీపని విన్న లోకులు నవ్విపోదురుచూడరా।
నివ్వటల్లినదయను భక్తుల నివహమును కాపాడరా।
పువ్వులివ్వియె, దివ్యమై భవపూడివాడరమాధవా।